వర్షాలలోను యీచెప్పిన గణితోత్పత్తికాలమునాటి శకవర్షాలు తీచి వేచీది। తీచివెయ్యగా కరణగతాబ్దాలు అవును। ఆకరణగతాబ్దాలు పెట్టుగుని భ్యస్తోక్తైః అని అవి పండ్రెండు గుణియించినవి మాసాలు అందులో గతమాసాలు కలయకూడేది। గతమాసాలు లేకపోయినా అట్టే వుంచేదీ। పృథక్ అని వేరే వక ప్రతిబెట్టి ఆప్రతి తిథ్ను అని మూడు గుణించి స్వా అని ఆప్రతి మరివక ప్రతిపెట్టి ఆప్రతి అష్టాబ్ధినేత్రాంశాయుక్తా అని 248 కు పాలుగొనంగా వచ్చిన లబ్ధము 30 గుణించినవి మీది ప్రతిలో గలయకూడి ఆప్రతిలో శరశశాంకయుక్ అని ఆప్రతిలో మరిన్ని 15 కలయకూడి ఆ ప్రతి నాగనందాబ్ధసంయుక్తా అని 93 టిచాత పాలుగొనగా వచ్చినలబ్ధము అధికమాసాలు.

౧౬౧౭ శకవర్షాలు అవుచు నుండగా యువసంవత్సరమందు జ్యేష్ఠ బ ౧౪ శుక్రవారంనాను సూర్యోదయాదిఘడియలు ౧౦ మీద కర్కాటక లగ్నమందు అనృసింహాగణితం అనేటి తిథిచక్రం చరపాతతోనూడా లోకోపకారార్థమై తెనుగు సెయం బూనినవాడ అయిల సోమయాజుల కుల సంభవుడైన రామచంద్రభట్లగారికిన్ని అచ్చమ్మకున్ను వరసుతుండ బాలయ నామధేయుండ యేను యీగ్రంథము తెనుగుచేస్తున్న యీగ్రంథకర్తయైన శింగనాచార్యులకున్ను మనకు గణితప్రారంభ గురువయిన వురుమేటి అనంత భాట్లగారికిన్ని నమస్కారాలుచేశి చాయంబూనిన గ్రంథలక్షణం బెట్టిదనిన॥

## (d) వైద్యము.

### శారీరం.

### No. 302

P. 10. వాతాపిత్తశ్లేష్మనాడిభేదాలు పామువలె నడిచేది వాతనాడి। కప్పవలె నడిచేది పైత్యనాడి। హంసవలె నడిచేది శ్లేష్మనాడి। పామువలెను కప్పవలెను నడిచేది ద్వంద్వజము। ఇతి వాతపిత్తనాడి। వాతశ్లేష్మనాడి పాము

పలెను హంసపలెను నడుచును । పిత్తశ్లేష్మనాడి కప్పవలెను హంసవలెను నడుచును । మూడుకూడా ఒక్కసారి నడచేది సన్నిపాతం.

P. 12. జ్వరనాడి చూచేటప్పుడు తనవ్రేళ్లతుదలు అంకుశరూపముగా వంచుకొని చూచేది । ఆనాడి । వేగంగా నడిస్తే జ్వరము వున్నదని యెరింగేది.

P. 13. కాలం యెరింగేదిన్ని । దోషా లెరింగేదిన్ని । దోషకాలా లెరింగేదిన్ని । రోగం యెరింగేదిన్ని । వయస్సు నెరింగేదిన్ని । భోజనకాల మెరింగేదిన్ని । మనుష్యుని కాలం రెపాడి । పదిఘడి శ్లేష్మకాలం ఆమీద పదిఘడియలు పైత్యకాలం ఆమీద పదిగడియలు వాతకాలం ప్రొద్దుగుంకిన వెనుకనున్నూ శ్లేష్మకాలం మొదలుగాను మూడుదోషాలున్నూ యీలాగుననే నడుచును అందులో సూక్ష్మంగాను మూడు పాలికెలవును । వుదయం మొదలుగాను శ్లేష్మ పైత్యవాతాలు దినమున్నూ నడుచును । ఆ మూడు పాలికెల లోపలనున్నూ సూక్ష్మంగాను వుదయం మొదలుగాను ఘడియఘడియకు శ్లేష్మపైత్యవాతాలు నడుచును అరఘడియయం దవును । ఆ అరఘడియయందులోనున్న శ్లేష్మం క్షణం । పైత్యం క్షణం । వాతం లక్షణంగా నడుచును । అందులో ఉత్పత్తిస్థితిలయాలు యెరింగేది. దేహమందు శ్లేష్మపిత్తవాతాలు తెలిసేవిధము । వాతదేహము ఒకవేళ ఉష్ణం । ఒకవేళ శైత్యమునైన్ని యుండును । పైత్యదేహము ఒకవేళ అత్యుష్ణము ఒకవేళ అతి శీతలమునై యుండును । శ్లేష్మదేహం ఒకవేళ అంతమాత్రం చల్లనై యుండును । ద్వంద్వమైతే । ఉష్ణశైత్యాలై యుండును । శ్లేష్మవాతాలు కేవలం శైత్యమై వుండును । మానేటి వాతశ్లేష్మాలు ఉష్ణమై యుండును మానవివి అతి శైత్యము బొంది శ్లేష్మవాతాలై నడుచును । మానిన్ని మానవివి శ్లేష్మపైత్యాలై నడుచును । మానని వాతపైత్యం కష్టసాధ్యమైతోచును । సాధ్యం అసాధ్య । కృచ్ఛ్రసాధ్యంలు। సాధ్యాంలోపల । పైత్యశ్లేష్మవాతాలు సాధ్యాలు । ద్వంద్వకాలైనవి మానసివి । సన్నిపాతాలని యెరింగేది।

## పద్రసనిఘంటు.

### వెంకటేశ్వరరావుగారి తాళపత్రగ్రంథంనుండి

సువర్ణశుద్ధి । తాంమ్రభస్మం జిల్లేడుపాలు । హంసపాదిరసం మర్రిపాలు మేకపాలు దూలగొంటిఆకురసం । రావిచక్కరసం యేడేసిమాలుమదణాసాచేశిది । యెన్నిరసాలో అన్నిమాలు యేడేసిపుటాలువేశిది । బాలసూర్యోదయ క్రమానవుండును । భస్మప్రకారం । శుద్ధిచేసిన బంగారంరేకులు చేయించి మూకుడుమీద యర్రమన్నుపాత్రవకటిచేసి వుంచీది । ఆపచ్చిపాత్రలోను నిమ్మపళ్లపులుసుపోసి బంగారంరేకులుకాచి యేడుమాలుమంచీది । అంతటే శుద్ధిఅవును । ఆరేకులు చిన్నరవలుచేసి జంబీరరసాన హేమాక్షికం నూరి అబంగారపురేకులనుబూసి యెండబెట్టేది । పెంకు కిందామీదాపెట్టి నడుమబంగారంబెట్టి సందులను వస్త్రమృత్తికచుట్టూ మూసుమాలుపట్టించి యెండబెటి గజపుటంవేస్తే భస్మంఅవును ॥

పగడాలు జిల్లేడుపాలలోవేసి మూడుదినాలు యండబెట్టేది । మూకుడుకింద్దామీదాబెట్టిది । లోపలను ఆపగడాలుపెట్టి వక్కగజపుటంవేస్తే తక్షణం భస్మంఅవును ॥ సంతానానకు । గొడ్డుపురుగు నివారణం । స్త్రీయోనిలో పురుగువుండును । అదియింద్రియాదుల్కు నోరుతెరుచుకొనివుండును । అందుచాత గర్భంనిలువదూ ॥ అందుకు అవుషధం ॥ అరటిపండు గుజరుతేనెలో కలిపి యోనిలోవుంచీది । వంకాయవఘటి తొణికతీసివేసి అందులో ఆవునెయ్యిపోసి యోనిలోవుంచేది । దూదిపాలతో తడిపి తరువాతవుంచీది । మరిన్ని కర్పూరం నూనెకలిపి ३८ మాలు రంగరించి అదిదూదినితడిపి యోనిలోవుంచీది । యోనిశుద్ధిఅవును । గర్భంనిలుచును ॥

### మరిఒకవైద్యగ్రంథమునుండి.

గురుత్వద్రవ్యాలవల్లను । మిక్కిలి వుష్ణద్రవ్యాలవల్లను । క్షారద్రవ్యాలవల్లను । శైత్యద్రవ్యాలవల్లను । దుఃఖంచేతనున్ను అతిసారంపుట్టును॥

వా తాతిసారలక్షణం । వాతాతిసారాన్కి మలము నురుగువలెపడును। శ్యామల వర్ణమైవుండును । పొత్తికడుపునొచ్చును । సర్వఅవయవాలు నొప్పిగలిగి యుండును । అవలింతలు గలిగియుండును । మలబద్ధమయివుండును । యీ గురుతులంగలిగియుండెనా వాతాతిసారమని తెలిసేది ।

సాధ్యాసాధ్యాలు । కన్నులు కల్వరేకులవలెనుండును । ముఖం చెందృనివలెనుండును । నాడి సమధాతువయివుండును । తుంమ్మువచ్చును । ఆకలి అవును । తల దురదగలిగివుండును । అంన్నంమీద యిచ్ఛగలిగియుండును। శరీరం లఘువుగావుండును । దంతాలు మల్లెమొగ్గలవలెవుండును । నాలుక మంచ్చిద్రవంకలిగివుండును । గంజితాగితే చెమటపెట్టును । చెవులు సమంగా వినవచ్చును । నాసికము మంచ్చిపరిమళము గ్రహించ్చును । కాళ్లుచేతులు కొంచ్చంవుష్ణంగలిగియుండును । అరిచేతుల రేఖలయందుంన్ను గోళ్లయం దుంన్ను రక్తంకలిగియుండును । యీగుణాలుగలరోగం సాధ్యమని చికిత్స చేశేది । జ్వరం తీవ్రంగాకాసును । లేదా మిక్కిలి ; చల్లగానయినావుండును । కుటిలమై జ్వరం కొంచ్చెంగానయినా కాసును । కంన్నులయొంద్దురక్తంలేక యుండ్డును । మాటలుంన్ను వుశ్వాసనిశ్వాసాలుంన్ను సముద్రధ్వనిగావుండును। చమటలేకయుండును । లేదా మిక్కిలి చమటఅయినాకద్దు । ముఖమంద్దు కాంత్తిలేకవుండును । కన్నులు వుబ్బుకునివుండును। ...గుణంకలిగియుండ్డును। బొడ్డువద్దనుంన్ను రొంమ్ముంన్ను ముక్కున్ను చమటబెట్టును కాళ్లుచేతులు మిక్కిలిచల్లగావుండును । వూర్ధ్వశ్వాసకలిగియుండును । ధనుర్వాయువ గని పించ్చును । వెక్కిళ్లుగలిగియుండును । గళమందు శ్లేష్మందట్టియుండును । పరిమళద్రవ్యములు అఘ్రాణించితే వాసనలు తెలియకుండావుండును । మలం కపిలవర్ణమైవిడుచును । నాడిశిథిలమయి చపలమై సూక్ష్మమయి నడుచును । మొదట పైత్యగతి నడుచును । అతర్వాత వాతగతినడుచును । అతర్వాత శ్లేష్మగతి నడుచును । మాటిమాటికింన్ని చంద్రాకారంగా ధాతువు నడుచును । యెవరికయినా మందనాడిపుటితే నిశ్చయముగా అసాధ్యమని తెలిసేది ।

జ్యోతిషం చెప్పేవారున్ను । ధర్మాధర్మం చెప్పేవారున్ను । వైద్యమున్ను షోడశకర్మలున్ను చేయించ్చేవారు శాస్త్రం తెలియక చేయించి రట్టాయనా వారు బ్రంహ్మఘాతకులని చెప్పుదురు । అది కారణం వల్లనుంచ్చి సకలయత్నాలచాతనున్ను శాస్త్రం విచారం చేసి మరీచూడవలెను । సూర్యకాంతమున్ను పంచదారా భక్షింపను రక్తప్రమేహం మానును । మరిన్ని । నేలతాడివేరున్ను పంచదారా భక్షింపను రక్తప్రమేహం మానును । తెల్లదింటెన వేరు పాలతో తాగను పెట్టుమందు పడిపోవును ।

కణపకాయ సోలెడుచల్లలో కలిసియిస్తే శూలలు మానును । కణపకాయానున్ను వేపాకూనూరియిస్తే దురదలు మానును ।

కణపకాయానున్ను వావిలాకున్ను సరిగాపొడి చేసి నేబుయొత్తుచొప్పున నలభైరోజులు శేవిస్తే పెద్దరోగాలు మానును ।

రాజవశ్యానకు । కణపకాయా వావిలవెక్కాలు నిమ్మపంటిపులుసును గంధంతిసి తిలకంపుంచుకువెళితే రాజవశ్యం ।

## వైద్యశాస్త్రము.

ముండలేక వెంకటేశ్వరరావు గారివద్దవున్న వైద్యశాస్త్రంనుండి·

గుల్మరోగాలకు చికిత్స । తెప్పతిగె మొదరవేరు తెచ్చి రొండుచక్కాలు చేసి, నరాలు తీసి తులం యింగువచక్కాల నందున పెట్టి దగ్గరగా కట్టి, జిల్లేడాకులు చుట్టి, యర్రమన్ను మొత్తి పుటం పెట్టేది. భరిణవేళ్లరసంతోటి మర్దనా చేసేది । వెంపలివేళ్లరసం అనుపానం చేసేది ।

మేహపైత్యానకు చికిత్సా । గూలగులు అరతులం, దాక్షిణీచక్కా అరతులం రససిందూరం తులం యీమూడున్ను చూర్ణం చేసి అందులో అరతులం అభ్రకం కలిపేది. పావుతులం పచ్చకర్పూరం కలిపి యిరవైనాక్కపొట్లాలు కట్టించేది ! రెండుపూటలుకూడా తురంజీదబ్బపళ్లరసంలో అర

తులం చీనాపంచదార కలిపి, యీ పొట్లాము కలిపి రెండుపూటలూ యీలాగే యిప్పించేది । యిచ్ఛాపత్యం చేయించేది॥

నశ్యంచేసే క్రమం॥

బాధరాపువ్వు తులం, లవంగాలు అరతులం, మిరియాలు అరతులం, యివి చూర్ణంచేసి ఆవునెయ్యి తవ్వెడు, గుంటకలగరఆకురసం సోలెడుకూడా కలిపి తైలపాకాన వండి వడపోసి, యీచూర్ణం కలిపి కొద్దిగా మరిగించి శిరస్సున మర్దనా చెయ్యడం. నాశికయందు నస్యం చేయిస్తున్నదం॥

అథ సన్నిపాతనిదానాని॥ (శ్లోకం) అర్థః । మొదటినుంచిన్ని । కాలరూపాన బాధచేసును । శరీరం తెల్లనై పొంగుదాకినయుండును । నొప్పి పుట్టును । లావుగాను ఆయాసంతో గూడియుండును। శ్లేష్మం గలిగియుండును । వొళ్లుమంట గలిగియుండును । సత్తువులేకయుండును । నిద్ర లేకుండును । యీలక్షణాలు గలది సంన్నిపాతము.

చిత్తవిభ్రమ సన్నిపాతనిదానాం । శ్లోకం । టీ॥ మిక్కిలి మోహమున్ను । తాపంచేతను పీడించును । తిరుగుతూ వుండును । పెదవగలిగియుండును ।

తాంత్రిక సన్నిపాతనిదానం । నాలుక నల్లనైయుండును । ఘట్టిగా వుండును । ముళ్లు నాలుకనడుమను, చుట్టూవుండును । చెవులలోను మ్రోత మ్రోయును॥ మెడా కదులురూ నొచ్చును ।

రత్నకామేశ్వరం॥ శ్లోకం॥ టీ॥ మాణిక్యాలున్నూ, ముత్యాలున్నూ, లోహమున్నూ । స్వర్ణమున్నూ । తామ్రం । వంగం । అభ్రకం । రంజితం । పగడమున్నూ । యివి భస్మాలుచేసి । వొక్కొక్కభస్మం వొక్కొక్కపాలున్ను । పారదం ౧ పా । గంధకం ౧ పా । యివిఅన్నీ కలిపి పాదరసం గంధకంతో కూడా మర్దనచేసి తరువాత తీసి గాజుబుడ్డిలో వుంచి వఖరోజా క్రమంగా పచనంచేసేది । సాంగశీతలం కానిచ్చి తీసి చూర్ణం చేశేది । కలమందరసంతో మర్దన । పచ్చకర్పూరం । కస్తూరి । తక్కువపుట్లు ।

జాజికాయ । జాపత్రి । యాలకులు । లవంగాలు । అగరు । చందనం । నాగేశ్వరపుపువ్వులు పుష్పాడి । పూర్వపు చూర్ణం యెంతవున్నదో అగుచున్న యీ అన్నివస్తువులు కలిపి చూర్ణం చేశేది । తామలపాకులలో యెనిమిది గులివిందగింజల యెత్తుచొ॥ నిత్యం పుచ్చుకునేది । పూట ౧కి నాల్గు గులివింద గింజల యెత్తుచొ॥ తమలపాకులతో నవిలి పుచ్చుకునేది । యీశ్లోకమందు చెప్పినఫలం చేసును.

"పురిపుష్టానిక్కి పురుగుడువేరు । నల్లులు ౭ న్ను చాతకట్టితే మానును। గుంటకలగరఆకు నలకళమిందపువ్వులు తింట్టే తలనొప్పులు మానును । యీ పిల్లులు ఉత్తరాణిగింజలు తింట్టే కాంతివచ్చును॥

పత్సళగకు ।-క్రియ । రేవటిములగఆకు మెత్తగా నూరి అందులో వొడపోసినరాసున్నం యిందువగింజంత పాడిగి మింగించేది ।

230) దొంగనుపట్టే క్రియ । పుట్టమీదవున్న తెల్ల యీశ్వరివేరు ఆదివారంనాడు తవ్వితెచ్చి పారేనీళ్లను కడిగి పనివచ్చినప్పుడు యీవేరు పారేనీళ్లతో అరగదీసి తన కుడిచేతికి పట్టించుకుని వెనలపల, లోపల పూసుకునేది । వకగిన్నె బోర్లించి ఆగిన్నెమీద యీ చెయ్యివేసి తన యిష్టదేవతలను మనస్సులో తలుచుకొని చెయ్యితీశేది । దొంగ యెక్కడవున్నాడో చెప్పుమనేది । చూపించుమనేది । అంత ఆగిన్నె నడచి యెవరిదగ్గరకు వెళుతుందో వారే దొంగలని గ్రహించేది॥ రెండోప్రకారం॥ నేలవుసిరిగవేరు ఆదివారంనాడు తవ్వితెచ్చి చిట్టిఆముదంలో అరగతీసి వంటెపుర్రెవానికి కాటుక వుంచి దొంగవున్నతావు చెప్పుమనేది । వాడివూరు వున్నచోటు వాడి పేరున్ను, వస్తువుకూడా చెప్పును॥

పసువులకు మలణమందు॥ మల్లెచిగురు । తుంమెకచిగురు । చిత్రగొట్టి ముక్కులో నశ్యం చేశేది । రెండోపక్షం నల్లవుష్మెత్తఆకు దూడరేణం నశ్యం చేశేది.

చలిపూష్టాలకు॥ తెల్లజిల్లేడు చక్కపచ్చిది తాళకం యీరెండూ తాంబూలంలో యిచ్చేది। వేడిఅన్నంల్లో తరువాణి పోశి అప్పుడే పెట్టేది। యీచొప్పున మునుపుపూష్టం వచ్చేవేళను యిచ్చేది। నిమ్మకాయ దబ్బకాయ పూరగాయ పెట్టేది।

హేమాక్షికం మూడుర్ఘాములు నిమ్మపళ్లపులుసున పుస్తే శుద్ధి। హేమాక్షిక భస్మం॥ గొప్ప మూకుడు తెచ్చి పొయిమీదవుంచి హేమాక్షికం నిమ్మపంటిపులుసున నూరి కుడక చేసి మూకుడులో వుంచి దానిమీద ప్రమిత మూతవేసి ఆ ప్రమిత సఖం మునిగేటట్టు నూనెపోసి మంట పెట్టేది। ప్రమిత లోపల చమురు మండును। మండి చల్లారితే భస్మం అవును॥ లోహభస్మం॥ లోహానికి సమం గంధకం। నాలుగోపాలు నవాసారం। యివి సున్నపు నీళ్లలో పదిరోజులు మర్దనచేసి బిళ్లలుచేసి యెండించి పుటంపెట్టితే భస్మం అవును॥

వెలగబంకతో వత్తిచేసి వెలిగిస్తే నీళ్లలో వెలుగును -

చచ్చినపిండానకు। ములగవేరు పులగలితో నూరి తాగితే పిండం కుడిపోవును॥

అదొండవేరు కడియంగా కట్టితే ఆయంధాలు నాటవు।

## వైద్యశాస్త్రం పార్నండివారివద్దనుంచి.

(శ్వాసఉబ్బసానకు) ఆరిటిపండువొలిచి మూడుముక్కలుచేసి అందులో చింతగింజంతసున్నంపెట్టి మూడుముక్కలు మూడుదినాలు తింట్టె శ్వాస ఉబ్బసం పొంతదగ్గుసహితంగామానును. వేడికొఱ్ఱగంజిలో జిల్లేడు ఆకులువేసి ఆకులుతీసి నులివేడిగంజితాగితె దగ్గుమానును.

(పొడిదగ్గుకు) కసిమిందపసూలం॥ వరిబియ్యం పిండిగాగొట్టి॥ నిప్పుట్లు కాల్చి నూనె అద్దుకొనితింటేను పొడిదగ్గుమానును.

(పొడిదగ్గుకు) దుష్టుపాకు వరిబియ్యం పిండిగొట్టి నిప్పట్లుకాల్చి నూనెను తడుపుకొనితింటె పొడిదగ్గుమానును.

(రక్తపైత్యానుక్కు) తేనె జీలకర్ర ఇంగువ। త్రికటుకం। యివినూరి। చింతపంట్టిని పొడిగి మింగిస్తె। రక్తపత్యం మానును.

(నెత్తురుపారి కక్కునందుకూ। గారవేరుతొక్క యెనుపపెరుగుతో। నూరితాగితె। నెత్తురు కక్కుడి, పారీది, మానును.

(కాకిచుమ్మలకు) మురుదొండాకురసం ముమ్మాటునశ్యంచేస్తే। కాకచుమ్మ మానును.

(కామెలలకు) తూర్పుకు పారిన తెల్లచింటెనవేరు తెచ్చి ఆవుపాలుతో తాగితె కామెలుకమానును.

(జ్వరకామెలకు) శొంఠిపొడి వుష్ణోదకంతో తాగితె జ్వరకామెలుక మానును.

చింతగింజంతసున్నం బెల్లానపొదుక్కొని తినవలసినది. యీలాగు మూడుపూటలుతింట్టె కడుపులోనిగుల్మ సమస్తశూలాలు మానును.

యవాక్షారం। నేతితో గాని। నీళ్లతో గాని। తాగితె। యెశూల అయినా మానును.

బెల్లం। మదనబుడతరసం। గలబురిరసం। దూసరరసం। పేణ్నీళ్లతో। నూరితాగితె యేశూలఅయినా మానును.

యలకకాటుకు నందివర్ధనపుఆకు నిమ్మకాయంతకునూరి చల్లనీళ్లను కలిపి। తాగితె యలకకాటువిషంమానును.

వుడికెఆకు। వెరుపజ్జాకు। వేపఆకు యివి నూరి తాగితె। పద్దెనిమిది విధాల యలకకరిచినా మానును.

మలమూత్రాదులు బంధించినందుకు। వెలుతురునారా। వెలమచెక్క। మిరియాలు। కూడా నూరి। కడుపున రాస్తె మలమూత్రాదులు విడుచును.

ముక్కున నోటను నెత్తురుకారినందుకు - వుత్తరేణి పసరున్ను। అడ్డ సరపు పసరున్ను। సరిగాజేసి తాగేది.

తలను వడలును యిడ అంటేది। ముక్కు నోట నెత్తురు కారేది మానును. మేడిపండు। బెల్లం తింటె నెత్తురుకక్కడం మానును.

కరకవేళ్లరసం। దాలిమ్మపువ్వురసం। బెల్లం కలుపుకొని తాగితె నెత్తురు కక్కడం మానును.

వైద్యగ్రంధమునుండి.

**రజితరసాయనం:—**

"రూపాయివకటి కరిగి నీరులాగు కరుగుతూ వుండగా వకపాఘతులం శుద్ధిచేసిన పాదరసంలో పోసి కలిపి ఖడ్డీ పోసుకునేది. యీఖడ్డీ వేణ్నీళ్ళ అరగదీసి వెంన్నలో కలుపుకుని పుచ్చుకునేది. యీలాగు అర్ధమండలం పుచ్చుకుంటే శుఖసంబంధమైన మేహారోగాలు పోతాయి. నూనె, ఆవ, పులుసు వర్జం."

**విషహరణముకు:—**

"తామరదుంప, తంగెడువిత్తులు, పత్తిగింజల గుదురు ఇది సమభాగములుచేసి నూరి త్రాగిస్తే విషాలు అన్నీ మారును."

"భూతాలు రాకుండా వుంచుటకు &c. సిద్ధయోగాన ఉశిరికవేరు తూర్పుది తెచ్చి చిట్టి ఆముదాన గంధంతీసి అదిచాతబెట్టి చూస్తే దొంగలు కానవత్తురు. భూతాలు తనయింటికి రాకుండా వావిలవేరు పువ్యమీ ఆదివారాన తనయింట వుస్తే భూతాలు చేరవు."

భరతశాస్త్రము.

e భరతశాస్త్రము by కోహళాచార్యులు

No. 452.

మొదటిశ్లోకమునకు టీక. యీలోకమందు సకలమయిన విద్వత్సమూహామునకున్ను శ్రేష్ఠమైనషువంటిన్ని సకలమైన భరతప్రవర్తకులకున్ను

శిరోభూషణమైనవుపంటిన్ని అత్యంతముంన్ను దయాశాలి అయినవుపంటి కోహళాచార్యుడైన విద్వాంసుడు సకల లోకోపకారంకొరకు నృత్తగీతవాద్యాలుంన్ను ప్రకాశింపజేసినవుపంటింన్ని వాంటికి ఆశ్రమమైనవుపంటింన్ని దశప్రాణాలతో కూడిన తాళస్వరూపముంన్ను లెస్సగా ప్రతిపాదించేటందుకు యిచ్ఛయించినవాండౌకుంచున్ను యీగ్రంథం నిర్విఘ్నంగా ముగిశేటికొరకు సర్వేశనమస్కారరూపమయిన మంగళమును శేయుచుంన్ను తాళస్వరూపము లెస్సగా ప్రతిపాదించెనేరి ప్రతిజ్ఞ శేయుచుంన్నాడు.

6 ఇప్పుడు భరతరశికులకు సంతోషార్థమైనతాళము నిత్యమా అనిత్యమా అని విచారింప్పబడుచున్నది.

శ్లో॥ తాళః కాలోననిత్యోన । ఖండకాలస్వరూపతః । చలనాత్ప్రాణసంబంధాత్రీన్మితేజన్మాదితోపిచ॥ టీ॥ అసౌ । యీ । తాళః కాలః। కాలస్వరూపమైనతాళము । ననిత్యః । నిత్యంకాదు । అందుకుయుక్తాలు । ఖండకాలస్వరూపతః । ఖండకాలాలు లఘుగురుప్లుతకాలాలు । యీఖండకాలస్వరూపమైనతాళము ఖండకాలము నష్టమైతేను తాళముంన్ను నష్టమాగన్క నిత్యంకాదు । చలనాత్ । తాళము నడుస్తూఉన్నది అనెడి వ్యవహారంవున్నదిగన్క గమనంగలవస్తువల్లను అనిత్యమెకావలెను । ప్రాణసంబ్బంధాత్ । కాలాది ప్రాణసంబంధంవల్లనుంన్ను దేహంవల్లనె అనిత్యమెకావలెను. మితిః । యింత్తపర్యంత్తముంన్ను ధృవతాళమువున్నది । యిటమీదట లేదని మితమేర్పడినది గనుకనుంన్ను అనిత్యమేకావలెను । జన్మాదితోపిచ । యీశ్వరుని పంచముఖాలవల్లను మార్గతాళాలుపుట్టెను. అందుకు వొకతాళంకింద ప్రస్తారతాళాలు అనేకతాళాలుపుట్టెను. అందుకు ఏకతాళంకింద యిబ్బుదువున్నవి । నష్టమైపోయెను । అనేటి వుత్పత్తిస్థితిలయాలు తోస్తువున్నవిగన్క యీ అయిదుహేతువులవల్లనుంన్ను తాళము అనిత్యముకాని నిత్యంకాదు । యికను అనిత్యమనేటిమాట కెంక్కింప్పచున్నాడు.

## అభినయదర్పణము.

1. అంగుష్ఠతర్జనీమధ్యా...ఈ గీతున్ను అంగుష్ఠాదివ్రేళ్ల పేర్లు. పతాకః ...ఈ అరా న్ని అసంయుంతహస్తాలు. పతాకహస్తానకు లక్షణం. ప్రసారిణాం చాంగుళీనాం ..తర్జని మొదటను అంగుష్ఠము కొంచముగావంచి కడమ వ్రేళ్లనుచాచినది పతాకహస్తము. దీనికి స్వక్షేత్రము వృథయపార్శ్వముల యొందు హస్తము కదుల్చుటవల్లను వినియోగము - నాట్యారంభేవివాహే... నాట్యారంభే-నాట్యారంభమందున్ను, వారివాహే-మేఘమందున్ను, వనే - వనమందున్ను, వస్తునిషేధకే - వద్దనేటియందున్ను, కుచస్థలే - కుచస్థలమందున్ను, నిశాయాంశ-రాత్రియందున్ను,...(1 టి అధ్యాయము- 1టి పుట)

2 సంయుంతహస్తాలు...పుష్పపుటం...ఈపదమూరున్ను సంయుంత హస్తాలు. పుష్పపుటహస్తానకు లక్షణం. సర్పశీర్ష...సర్పశీర్ష హస్తాలు రెండున్ను కూర్చిపట్టినది. వినియోగం. సంధ్యావార్చేయొందున్ను, అర్ఘ్యప్రదానేచ- అర్ఘ్యంయిచ్చేయొందున్ను...(2 వ అధ్యాయము- మొదటిపుట.)

[కేశవపట్నం శాంతయ్యది. పర్లాకిమిడీలో పోకలవారింటనున్నది.]

## సవ్యాఖ్య అభినయదర్పణం.

నాట్యారంభే, నాట్యారంభమందున్ను వారివాహేవారి, వుదకంతో కూడుకున్నటువంటి వాహే మేఘమందున్ను వనే వనమందున్ను వస్తునిషేధనే వద్దనడమందున్ను కుచస్థలే రొమ్మునందున్ను నిశాయాంచ రాత్రియందున్ను నద్యాం నదిచెప్పేయందున్ను అమరమండలే దేవతామండలమందున్ను తురగే గుర్రమందున్ను ఖండనే నరుకుయందున్ను గమనోదితే నడకచెప్పే యందున్ను ప్రతాపే చ ప్రతాపం చెప్పేయందున్ను ప్రసాదేచ అను గ్రహంచెప్పేయందున్ను చంద్రికాయాం వెన్నెలచెప్పేయందున్ను ఘనాతపే ఘనమైనయండచెప్పేయందున్ను కవాటబంధనే తలుపుమూసెయం

దున్ను సప్తవిధ త్త్వర్థే సప్తవిధత్తులుచెప్పేయందున్ను తరంగకే తరంగాలుం చెప్పెయందున్ను సాభిస్వర్శేచ సాభిస్వర్శంచెప్పెయందున్ను శీతలత్వే చలి యందున్న మెరపు అనేటి యందున్న

## తాళలక్షణసంగ్రహము.

ముఖంయెదుటబట్టితేను గోరోచనమందు ఉద్వేష్టితంగా నిలిపితేను విభూతి అనేటి చెవులనడుమ నిలిపితె కర్ణామృత మనేటి భుజంమీద నిలిపి తేను యత్నమనేటి ముందర నిలిపితేను శత్తురనేటి వ్యావర్తకమైతేను నరుకుట రొండు చెల్లును.

## మృదంగలక్షణం.

టీక—పూర్వమందు మురాసురు డనేటి రాక్షసుడు గంగాతీరమందు మునీశ్వరులు సత్రయాగం చేస్తూవుండగాను దేవపతిమొదలైన బ్రహ్మావిష్ణు మహేశ్వరులున్ను పురోడాశ నిమిత్తమైవస్తేను ఆదేవతలకు రాక్షసులకు యుద్ధమైతేను ఆ కాలమందు విష్ణువు మురాసురుని పట్టుకుని కాళ్లుచేతులు శిరస్సు మూడున్ను ఛేదించి వాని శిరస్సు రెండు కప్పలు చేసి రెండుపారి శ్వాల తీసి కట్టెను. వాని పాదాల చర్మము తీసి వాళ్లు చేసి రెండురంధ్రాలు చేశి కొట్టి మూశెను వాని కడుపులో వున్న అన్నం తీశి బోనంగా చేశి అరు అంగుళాల ప్రమాణంగా యడమపాశ్వాంచేశి కుడిపాశ్వామందు చిట్టెము న్ను విభూతిన్ని అన్నమున్ను యీమూడున్ను గూర్చి మర్దనం చేశి ముఖ మందు రొనిమిది అంగుళప్రమాణం కరిణచేశి వాయించగా యడమ పాశ్వా మందు ధిమధిమా అనే శబ్దం పుట్టెను కుడిపాశ్వామందు ధ్వని పుట్టెను. అటువంటి మృదంగం తీసుకుని సంతోషంగలవాడై నందికేశ్వరునికి యిచ్చెను ఆనందికేశ్వరుడు ఆ మృదంగం తీసుకుని దీని స్వరూపము యేమని అడిగెను.

## కళాశాస్త్రము

### అల్లూరి పురుషోత్తముకవి, No 460.

పద్మిని కుందనపు బంగారువన్నెగాని నల్లకలువలవన్నెగాని కాంతిగలిగి తామరపద్మమువంటి సువాసనగలశరీరము సెవలింకించమువంటి నల్లనిజుత్తు చంద్రునివంటిముఖము కలువలవంటికళ్లు శంఖమువంటి మూడురేఖలుగలగళము 32 పళ్లు పలుచనినాలుక అతిమృదువగు శరీరము...సంపెంగరేకువంటి ముక్కున్ను...నఖాగ్రములయందు పాదాగ్రములయందు యెరుపున్ను స్వల్పాహారమున్ను - మదపుటేనుగవంటి నడకయున్ను...

## మృగయాత్ర

అథాతస్సంప్రవక్ష్యామి మృగయాత్రస్యలక్షణం
ధనుర్ధరాస్తథా కేచిత్కేచిత్ఖడ్గధరాస్తథా
కేచిదశ్వసమారూఢాః కేచిద్యుద్ధముఖాభటాః
ఏవం విధైర్భటైర్యుక్తో గీతవాద్యసమన్వితః
చాపసాయకచక్రాసి గదాకుంతాదిసాధనైః
భటాంగేచాశ్వపంవ్యాప్రతస్థే చంద్రశేఖరః
తెలుగు (శ్లోకములకే)

మృగయాత్రలక్షణం యెటువంటిదంటెను వింట్లుధరించ్చిన వా కొంద్దరుంన్ను కత్తులు ధరించినవాల్లూ కొంద్దరుంన్ను గుర్రపు వాహనాల వాల్లూంన్ను యుద్ధముఖ్యులైన వీరభటులు కొంద్దరుంన్ను యీప్రకారమైనటు వంటి మహాపరిజనంకలవాడౌకుంచ్చుంన్నూ మరింన్ని గీతవాద్యములతోకూడు కుంచ్చుంన్న వాడౌకుంచ్చుంన్న మరింన్ని విల్లుబాణచక్ర అసిగదాకుంత్త యివిమొదలుగాగలటువంటి ఆయుధాలచాతనున్ను క్షత్రియధర్మంచాతనుంన్ను

ఉత్తమాశ్వములను యెక్కినషువంట్టి వీరభటులతోటిన్ని వ్యాటనిమిత్తం ఆరంణ్యానకు పరమేశ్వరుడు తల్లీనవారైరి. ఆఅరణ్యాం యెషువంటిదంట్టేను.

శ్లో. మందారచూత పనసావకుళాశోకచంపకైః

## వాస్తుశాస్త్రం

టీక. సోమవారం నాడు యిల్లుకట్టితేను కలహా మౌను అదివారం నాడు యిల్లుకట్టితేను కాలును

యీా తిధులలోను రోహిణీనక్షత్రం కూడిన నాడు యిండ్లకు కలప నరికితేను మంచిది. కుమ్మరొయ్యనరికినా నునుళి బట్టదు పదమటి చూస్తూ వుందును.

టీక. వాస్తుపురుషుని ద్రిష్టి యెదురు వాకిలిగాను యిల్లుగట్టితేను మంచిది నొలు! తక్కినచోట్లను ద్రిష్టికి విపరీతం గాను కట్టితేను ఆయింట శోకరోగభయాదులు కలిగివుండును అటుగనుక (గ్రంధకర్తపేరులేదు)



# అనుబంధములు.



## లక్షణగ్రంథాలు.

### 1. అప్పకవీయము

### లోని వచనములు.

[ఆశ్వాసాంతగద్యలను, కావ్యములలోని గద్యలను లక్ష్యములుగా రచించిన వేవో రెండుమూడు వచనములుతప్ప తక్కిన తెలివిడి, వివరణము, టీక, అవతారిక మొదలయిన పేళ్లతో ఉన్న వచనములన్నీ అప్పకవి వ్యావహారికభాషలోనే రచించినాడు. వ్రాతప్రతు లన్నిటిలోను ఈ వచనములు వ్యావహారికభాషలోనే కనబడుతున్నవి. అయితే, ఈ గ్రంథము 1859 లో ముద్రించినప్పుడు గ్రంథమును పరిష్కరించి అచ్చువేయించిన శ్రీ రేకము రామానుజసూరిగారు ఈ వచనములన్నీ కావ్యభాషలోనికి మార్చి అచ్చు వేయించినారు. తర్వాతి ముద్రణములలోకూడా ఈ వచనములు వారు సవరించినవిధముగానే కావ్యభాషలో కనబడుతున్నవి. అయితే, వారు దిద్ద మరచిన శబ్దములు కొన్ని—'ఇందుకు', 'పనిహీనపయచ్చు', 'కాదంటేను', 'రెండోసారి', 'బజాఅవాండ్లు' మొదలయినవి నిలిచిపోయినవి. అప్పకవి వ్యావహారికభాషలో ఈ వచనములు ఉద్దేశపూర్వకముగా రచించి ఉండుననుటకు ఇవి నిదర్శనములుగా ఉన్నవి. ఈ వచనములు ఒకొక్కటి చదివి పూర్వోత్తరసందర్భములు పరిశీలించి చూస్తే గ్రంథకర్తకాక మరియొకరు ఆ వచనములు వ్రాసిఉండరని తెలియకపోదు. (చూ. I. 85 తర్వాతి వచనము; VI. 118 - దానికి పూర్వమందున్నవచనములు; IV. 133-దాని తర్వాతి టీకలు).

ఈ గ్రంథము సం. 1924లో బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారు ముద్రించినపుడు ఈ వచనములన్నీ వ్రాతప్రతులనుబట్టి అప్పకవి ఉద్దేశించి వ్రాసినట్లే వ్యావహారికభాషలోనే ఉన్నవి ఉన్నట్లుగా అచ్చు వేయించడము జరిగినది.]

[తే. ప్రత్యయము లాఱు నీ చెప్పు పద్యములను ।
తెలిసికొన నెంతవారికి నలవిగామి ।
వరుస నన్నింటికిం డీక వ్రాయవలసెఁ ।
దెనుఁగుమాటలఁ గడు తేట తెల్లగాఁగ ॥]

## IV. 133

టీక. మేరు చక్రమనగాను ఇన్నవఛందమునందు ఎన్నేసి లఘువుల వృత్తములు ఎన్నియని యడిగితేను సరిచెప్పేటివిధము. మొదల అడ్డవీథిగా రెండిండ్లు వ్రాసి యాక్రిందను వెంబడిగాను రెండు పార్శ్వములయందున్న ఒక్కొక్కయిల్లు మించియుండేటట్లుగాను మొదటివీథితోఁగూడాను ఇరువైయారు అడ్డవీథులుగాను గీటులు తివిచి ఉభయపార్శ్వములయందున్న మించియున్న కడపటి యిండ్లను మీదియిండ్లు మొదలుకొని అన్నియిండ్లను తప్పకుండాను ఒకట్లుపెట్టి మీది వీథినున్న లెక్కలక్రిందను దిగువవీథియందు నిడుపుగాను ఒక్కొక్కయింటను ఆ లెక్కలకు క్రింద ఉండేటట్లుగాను వ్రాసేది. ఇటువలెనే వ్రాస్తేను మీదివీథికంటె క్రిందివీథిని ఒక్కొక్కయిల్లు ఎక్కువ అవుచును వచ్చును. ఈ క్రమము వ్రాసితేను ఈ మేరుచక్రమునందు పైవీథిమొదలుగాను అడ్డవీథులనిన్నీ ఉక్త మొదలైన యిరువైయారు ఛందములున్ను క్రమముననే అవును. ఆ వీథులయందు మొద లిండ్లనున్న ఒక్కటొక్కటిన్ని సర్వగురువృత్తములు. తుదియిండ్లనున్న ఒక్కొక్కటిన్ని సర్వలఘువృత్తములు; రెండవయిండ్ల ఎన్నిఉంటేను అన్నిన్ని ఒంటి లఘువృత్తములు; మూడవ యిండ్లవి రెండేసి లఘువులవి; నాలవయిండ్లవి మూడేసి లఘు

పులవి; ఈప్రకారముననే మందరనున్న అన్నియిండ్లకున్ను అని తెలుసు కొనేది. ఆ వీథిని ఉన్న లెక్కలన్నిన్ని కలియకూడితేను ఆ ఛందమున బుట్టిన సమవృత్తసంఖ్య యవును. వారెన్నవఛందమున కడిగితేను అన్నవ యడ్డవీథి చూచి యిప్పుడు చెప్పినచొప్పున సరిచెప్పేది. విఛందముదనుకాను వ్రాయమంటే అఛందముదనుకాను వ్రాయనున్ను వచ్చును. IV. 151

సంస్కృతగ్రంథములకు

## 2. వ్యాఖ్యానాలు.

### శుద్ధాత్మ చైతన్య ప్రకారానుభూతి ప్రకరణ వ్యాఖ్యానము.

౧౨౹ శ్లో౹ ఉపాధా యథా భేదతా సన్మణీనాం
తథా భేదతా బుద్ధి భేదేషు తేషు
యథా చంద్రికాణాం జలే చంచలత్వం
తథా చంచలత్వం తవాపీహ విష్ణోః ॥

టీక. సన్మణీనాం । సత్-మంచిదైనషువంటి । మణీనాం - స్ఫటికాది మణులకు । ఉపాధా - నీలపీతరక్తాద్యుపాధులయందు । సంబంధంవల్లను । యథా-యషువలెను । భేదతా-భిన్నత్వమో । తథా - అషువలెనే । తేషు - నానారూపాలైనషువంటి । బుద్ధిభేదేషు - బుద్ధ్యుపాధులయందు సంబంధం వల్లను । హే విష్ణోః-కూటస్థాత్మతో అభిన్నమైన వ్యాపకస్వరూపుడా । తవ-నీకు । భేదతా - భిన్నత్వముగాని । స్వభావంచేతనైతే శుద్ధాత్మ ద్వితీయ స్వరూపుండవు । చంద్రికాణాం-వెనెలలకు । జలే-వుదకమునందు । యథా - యషువలెను । చంచలత్వం - చలించడమో । తథా - అషువలెనే । తవాపి - కూటస్థాత్మవైన నీకున్ను । ఇహ - బుద్ధ్యాదులసంబంధవల్లను । చంచలత్వం - చంచలించినవలె నుండుగాని । స్వభావంచేతనైతే అచంచలుడవున్ను నిర్వి కారుడవున్ను పరిపూర్ణుడవున్ను ॥

## దక్షిణామూర్తిస్తోత్ర వ్యాఖ్యానము.

శా. శ్లో॥ సర్వాత్మత్వ మితి స్ఫుటీ కృతమిదం యస్మాదముష్మిం స్తవే
తేనాస్య శ్రవణా త్తదర్థమననాత్ ధ్యానాచ్చ సంకీర్తనాత్
సర్వాత్మత్వ మహావిభూతిసహితం స్యాదీశ్వరత్వం స్వతః
తస్మైశ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

టీక. యస్మాత్ - యేదికారణంవల్లను । అముష్మిం స్తవే - యీదక్షిణా మూర్తిస్తోత్రమందు । యిదం-యీచెప్పినషువంటి । సర్వాత్మత్వం - సర్వాత్వ మున్ను । ఇతి-యీ చెప్పిన ప్రకారంచేత । స్ఫుటీకృతం - స్పష్టమై కాయ బడెనో । తేన - అది కారణంచేతను । అస్య - యీస్తోత్రంయొక్క, శ్రవణాత్ - అర్థం వినడంవల్లనున్ను । తదర్థమననాత్ - ఆ విచారించినషువంటి అర్థంయొక్క చింతించడంవల్లనున్ను । ధ్యానాత్ - చింతించబడిన అర్థం యొక్క చింతించడంవల్లనున్ను । సంకీర్తనాత్ - వాక్కున పఠించినవల్ల నున్ను । సర్వాత్మత్వ మహావిభూతిసహితం - అంతా తాను అవుట అనే సామ్రాజ్యంలో కూడుకో వున్నషువంటి । యీశ్వరత్వం - ఈశ్వరత్వము । స్వతః-తనకుతానే । స్యాత్-అయ్యీని । అష్టధా - అణిమాద్యష్టవిధంగాను । పరిణతం-పరిణమించినషువంటి । తత్ - ప్రసిద్ధమైనషువంటి । అన్యాహతం - చ్యుతిలేనషువంటి । ఐశ్వర్యంచ-ఐశ్వర్యమున్ను । సిద్ధేత్-లభించీని॥

### నిఘంటువులు - కోశములు.

## 3. సర్వశబ్దసంబోధినీ.

[ఇది రమారమీ నూరుసంవత్సరములకిందట శ్రీ పరవస్తు శ్రీనివాసా చార్యులవారు వ్రాసిన నిఘంటువు. వారు సంస్కృతపదములకు తెలుగున అర్థము వ్రాసినప్పుడు సంభాషణలో ఉన్నమాటలే తరుచుగా వాడినారు. వారి తదనంతరము మరి 50 సంవత్సరములకు 1875 సం॥లో ఈ నిఘంటువు

ఆచ్ఛొత్తించినప్పుడు కొన్ని మాటలరూపములు సవరించి చివరను శుద్ధపత్రికలో చూపించినారు. అయితే, అవిఅన్నీ విలేఖకప్రమాదజనితదోషములు కావు. "పొయ్యేవాఁడు", "పొయిస్తూ" అనడానికి బదులుగా "పోవువాఁడు", "పోవుచుచు" అని దిద్దినప్పుడు, గ్రంథకర్త వాడిన వ్యావహారిక భాష కావ్యభాషగా మార్చడమే సంభవించినది గాని లేఖకప్రమాదజనిత దోషములను సవరించడము కాలేదు. 'వాచ్ఛ్యాయన', 'యెముడు' అనే రూపములు వాస్తవముగా లేఖకప్రమాదమువల్ల కలిగిన తప్పులు. అవి 'వాత్స్యాయన' 'యముఁడు' అని దిద్దినప్పుడు, అది భాష మార్చడము కాదు. శుద్ధపత్రికలో సవరించిన వాడుకమాటలు వేయింట పదిన్ని సవరించక విడిచినవి తొమ్మిదివందల తొంభై ఉన్నట్టుగా గ్రంథములో అనేకముగా వ్యావహారిక భాషాపదములు కనబడుతున్నవి.

ఈ నిఘంటువులోని భాషాస్వరూపము తెలియడానికి కొన్నిమాటలు మాత్రము ఉదాహరిస్తున్నాను. మాటపక్కనే అది యేపుటలో ఉన్నదో ఆ పుటసంఖ్య సూచిస్తున్నాను.]

కూతురు కొడుకు 457
కూతురు కొమార్తె 458
వాండ్లు 272, 310, 351, 383
కండ్లు 302, 304, 293
అలుకొంగట్లు 317
మూడేళ్లదాకా 205
వల్ల 161
కొద్ది 20
వద్ద 45, 85
వాఁటి 32, 33, 34,46,61,62,270, 308, 347
చేసేటందుకు 167
దగ్గిర 16
తగలకుండా 263
లేకుండా 141
తెలియకుండా 270
కాకుండా 479
అన్నిటికిన్ని 279
యిదిన్ని 590
దాకా 134, 144
అందాకాను 361
అంతాను 361, 545

దీనినిగురించి మహామహోపాధ్యాయ తాతాసుబ్బరాయశాస్త్రుల వారు, "సర్వశబ్దసంబోధినీ నిఘంటువు నే కొరిగినదే. శ్రీమాన్ పరవస్తు శ్రీనివాసాచార్యులవారు రమారమీ నూరుసంవత్సరముల క్రిందట నీగ్రంథమును రచించినారు. సంస్కృతశబ్దములకు తెనుగర్థము చెప్పినప్పుడు తరుచుగా వ్యావహారిక భాషారూపములు ఈ గ్రంథములో వాడిఉన్నారు."

తాతాసుబ్బరాయశాస్త్రివ్రాలు, 6-3-1915.

## పండితుల జాబులు.

### అముద్రితగ్రంథచింతామణి పత్రికలో

పత్రికాధిపతులయిన పూండ్లరామకృష్ణయ్యగారున్ను వేదము వేంకటరాయశాస్త్రులుగారు మొదలయిన పండితులున్ను విద్యావిషయములను గురించి వ్రాసినవ్రాతలలో వాడిన వ్యావహారికభాషా రూపములు:—

1. పత్రికాధిపతుల వాక్యములు:—

"'ధరణిదేవులవల్ల' యను శబ్దములయందు వల్లయను పదమునకు మహాకవిప్రయోగము లేదని మాయభిప్రాయముగాని ధరణిదేవశబ్దమునకుఁగాదు. ఇందులకై రెండుజాబులవలన మీకు ప్రయాసము దీసుకొనుటయయినది."

"(పోషకభృతి) బంపనివారి నామములు పైపత్రికనుంచి ప్రకటించవలసివచ్చును"

"మాకయిష్టంబగుటచే మేమాపద్ధతి మొదటినుంచి విడిచితిమి."

"మావద్దనుంచు గ్రంథము"; "ఇరువురిని"; "అగుపడదు" "విశ్వసించవలెను"; "యోచించుచుండు"; "తెలుసును"; "తెలిసేయున్నది"; "వ్రాసుకొనియున్నారు"; "ఇతఁడొక కృష్ణరాజిల్లును; "గద్వాల చెన్నడి పద్యపంచకము"; "ఇంతటి దురభిమానమేలనో"; "అచ్చువేయించుచున్నరట."

2. వేదము వేంకటరాయశాస్త్రిగారు:—

"అగుపడుచున్నవి" (10-2-1894); "అందుకు"; "వ్రాసినాను"

3. కొండముది నరసింహముగారు:—

"ఇప్పుద్యమే అప్పకవిగారు లక్ష్యముగా దీసుకొనిరి"

"దీపాంకురమఘుమును గాని లతనుగాని భేదిస్తున్నట్టు చెప్పలేదు. నందకము పాపలతావళిని భేదిస్తున్నట్టు చెప్పయున్నది...అఘులతను భేదించదనే సంశయము తగలనేరదు. లతను భేదించుటకు కొడవలిచాలు గనుకనే కొడవలిచేతనయినపనికి నుత్కంఠదైత్యకంఠలుంఠనమైన నందకము భేదించదమని చెప్పడ మాయుంధమున కుచితముగాదనే సంశయమునకు సమాధానము యేమనగాఁ బద్యములో నఘులతాశ్రేణినని చెప్పక 'నఘులత' యని చెప్పియున్నట్టు

లయితే యాక్షేపణ తగులును. లతాసమూహంబనికూడా యనకుండా లతా శ్రేణియని చెప్పినందువల్ల శ్రేణియనఁగా దగ్గరగల పొడుగాటి బాఱు..."

"తమకు వ్రాసుకొనిన యుత్తరము..."

"నామలింగానుశాసనమందైనా లేవు"

"ముద్రింపఁగోరినాను."

"అట్టివాటియందు"; "బోధించడము"; "కూడా" "ఇంకా"; "కావడము."

4. నల్లాన్‌చక్రవర్తి సంపత్కుమార లక్ష్మీనృసింహాచార్యులవారు:—

"విజ్ఞానదిపాంకురాకృతిగల నందకంబను లతాశ్రేణిచ్ఛిదం జేయుఁగాక" యనుటచే, లతాచ్ఛేదనముకు లవిత్రము ప్రధానముగాని దీపాంకురము ప్రధానముగాదనిన్ని ఖడ్గమునే గ్రహించేయెడ, సమరోత్కంఠదైలేయ కంఠలుంఠనాకుంఠంబగు దానికి లతాచ్ఛేదన మంత్కర్షావహముగానున్నదనిన్ని ప్రకటింపఁబడియున్నది."

5. దబ్బీరు కృష్ణమూర్తిసూరిగారు:—

"గంధఫలికి నాయికాధ్వనిన్ని, సారంగమునకు నాయకధ్వనిన్ని పోల్చడ మప్రసక్తమైయున్నది...గంధఫలి యొక్క స్త్రీయైయుండి తనకిరుప్రక్కల నిరువురసారంగుల నాశ్రయింపజేసికొనడము సాధ్వీధర్మమునకు విరుద్ధము."

6. వడ్డాది సుబ్బారాయఁడుగారు:—

"అందుకు"; "అబ్బురపడినాను"; "చిత్తగించవలెను"

7. ఆ. పుండరీకాక్షయ్యగారు:—

"ఇందుకు"; "కనపరచడము"; "తోఁచక"; "పూనినాను" "కూడా", "ఉంటే"

8. నడకుదుటి వీరరాజుగారు:—

"తొలగించుదురుగాక"; "అందుకు"; "రచించఁగల"; "విమర్శకు" "వ్రాసుకొను".

9. మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు

"మూసుకోలేదు;" పంపించలేదా".

## 5 దినచర్యలు

### యాత్రావిశేషములు.

1. రాజమహేంద్రవరం జిల్లా-కోరు మిల్లిగ్రామం కాపురస్థులైన చేబ్రోలు సీతారామశాస్త్రులుగారు వ్రాసుకొన్న దినచర్యచూచి మందపాక పార్వతీశ్వరశాస్త్రులుగారు వ్రాసుకొన్నది.

౯. బదరీనారాయణమునుండి యీశాన్యముగా ౧ రోజులకు బ్రహ్మకపాలము చేరవచ్చును. యీనదుమను రఘునాథపూర్ అనేవహారున్నది. వహారులో బసచేసేయెడల అక్కడిరాజు (బ్రాహ్మణుడు) తనపండితులను రాజువద్దికిపంపును. ఆపండితులకు ఆలింగనాదిసత్కారములు వీరు జరిగించవలెను - వీరిపండితులను ఆరాజువద్దికిన్ని పంపవలెను. ఆరాజున్ను అట్లానే జరిగించును. యీ చొ॥ జరిగించనియెడల దోచుకుని అపాయము జరిగింతురు. పట్టణములో బసచేయక పైగా బసచేసేయెడల అట్టి ప్రతిబంధకాదు లుండవు. పట్టణములో దిగి పైని వ్రాసినసత్కారము లన్యోన్యము జరిగిన పైని కోరితే యాత్రలనుగురించి మజారీలను సప్లీచేయును.

... ... ... ...

2. గోకుల విశ్వనాథుడుగారు వ్రాసిన యాత్రావిశేషములను చూచి మందపాక - పార్వతీశ్వరశాస్త్రులవారు వ్రాసుకొన్నది.

పంజాబుదేశములో జ్వాలాముఖి అనే పర్వతమున్నది. దానిపై నచ్చటచ్చట తొర్రలలోనుండి అగ్నిజ్వాలలు వచ్చుచుండును. ఆ జ్వాలలకు యాత్రవారు సమర్పించే పేడా, అరిటిపళ్లు, టెంకాయలు, రవికలగుడ్డలు, వగైరాలకు అందినమట్టుకు ఆ జ్వాలలు భక్షించి ప్రసాదముగా కొంత విడచును - రవికలగుడ్డలు కాలకుండా యిచ్చివేసును-చేతులు కాలవు.

అకాలేశ్వరమను మహాయాత్ర యొకటి గలదు - అక్కడ శీతోష్ణ గుండములు రెండున్నవి. బియ్యపుమూట ముంచినయెడల అగ్నిగుండములో అన్నమగును.

అమరనాథం అను క్షేత్రమున్నది - అక్కడ శ్రావణ శుద్ధ పౌర్ణమికి మాత్రం మంచు లింగాకారముగా పానువట్టసహితముగా అందరికీ కనబడును.

ఆ మూడుయాత్రలు వైశాఖం లగాయతు కార్తికమాసమువరకూ నరపూజ-కొదువ ౬ నెలలు దేవపూజ జరుగును.

... ... ... ...

3. ఆనంద సం॥ ఆషాఢ శు॥ 6 తాది "శ్రీరంగవైష్ణవు"లొకరు వ్రాసుకొన్నది చూచి వృష సం॥ ఆషాఢ శు॥ 6 తాది మందపాక రామ శాస్త్రులుగారు వ్రాసుకొన్నది.

... ... ... ...

బదరీ నారాయణం

వృశ్చికమాసం ప్రవేశించడంతోనే రెండుమూడుదినములు పూజచేసి తలుపులువేసే సమయంలో శ్రీస్వామివారికీ నరనారాయణులకూ నారదుల వారికిన్ని ఆసమీపమందు వంటశాలలో వేంచేసియున్న అమ్మవారిని తీసుకొని వచ్చి యీపీఠమందు వుంచి అమ్మవారికిన్ని నఖశిఖపర్యంతం పిండి సమర్పించి కంబళీ పైనిసమర్పించి ఆపైని పేరుకున్న నెయ్యి సమర్పిస్తారు. శ్రీస్వామివారికి మాత్రం యిత్తడిచాటలు కడుపుమీదను వీపుమీదనూ ౨ సమర్పిస్తారు. ఉద్ధవులను ఆసమీపమందు ఆరుక్రోసులమార్గంలో వున్న పండికేశ్వరంలో వుస్తారు। తరువాత తలుపులువేసుకొని అర్చకులు మొదలైనవారు ఆ పండికేశ్వరానకు ఆరుక్రోసులలోయున్న జ్యోసీమఠంలో ప్రవేశించి మేషమాసపర్యంతం వుంటారు.

... ... ... ...

## వావిళ్ల రామస్వామిశాస్త్రులవారి చట్టపుస్తకమునుండి తునకలు.

"హిందూభాషాసంజీవని ముద్రాక్షరశాలాధికారులు తమ ముద్రాక్షరశాలయొక్క కార్యములు నిరంతరాయముగా జరుగుటకై యేర్పరచుకొన్న చట్టపుస్తకము. ఇది శ్రీ సరస్వతీనిలయముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె. చెన్నపురి తండయారుపేట. ౧౮౬౭ సం॥ జూలై ౧ తేది."

ఈ "హిందూభాషాసంజీవని ముద్రాక్షరశాలయొక్క కార్యములను విచారించుటకై భాగస్థులందరు చేత యేర్పరచిన కార్యనిర్వాహకసభికులు:— అగ్రాసనాధిపతులు: వావిళ్ల॥ రామస్వామిశాస్త్రులు; సరస్వతి॥ తిరువేంగడాచార్యులు. కార్యదర్శి: ఒగ్గులూరు వేణుగోపాలనాయుఁడు. ఉపకార్యదర్శి: శంకర॥ వెంకట్రావు. అధ్యక్షులు: వంగీపురం॥ రామకృష్ణమాచార్యులు; వస్త్రాల॥ తిరువేంగడస్వామినాయుఁడు"

1. హిందూభాషాసంజీవని ముద్రాక్షరశాలాధికారులు ౧౮౬౭ సం॥ జూలై నెల ౧ తేదియందు యేర్పరచుకొన్న చట్టము. మొదటిభాగము. పీఠిక— ఉపయుక్తములైన యీదేశగ్రంథము లనేకము లచ్చువేయఁబడకయుండుట చేత నాలాటిగ్రంథముల నచ్చువేయించి ప్రచురము చేయుటకును - ఇట్టి లోకోపకారమైన కార్యమునకు సహాయులై వలయుద్రవ్యము నిచ్చి భాగస్థులుగా నేర్పడిన సమాజమువారిద్రవ్య మభివృద్ధియగుటకును - ఈ ముద్రాక్షరశాల యుంచఁబడుచున్నది. కాబట్టి యీయుద్దేశ్యమున కంతరాయము గలుగకుండుటకై భాగస్థులందఱేకీభవించి యేర్పరచుకొన్న నిబంధనలు.

2. మన ఉమ్మడిలో సదరు తేదియందు నూతనముగా నేర్పరుపబడిన హిందూభాషాసంజీవనియను ముద్రాక్షరశాలను నేఁడు మొదలు పదియేనుసంవత్సరములవరకు సముదాయముగా నుంచి విడనాడక నానాటి కభివృద్ధియగునట్లు చేయుచుండవలసినది.

... ... ... ...

3. సదరచ్చుకూటమునకుగాను పెట్టుబడినిమిత్తము భాగము ౧కి రూ|| ౬౫౦ చొప్పున భాగములు ౧౪ కి రూ|| ౯౧౦౦ ఈదిగువ నుదహరింపబడు పద్ధతుల ప్రకారము కట్టవలసినది.

4. ౫వ కలములో చెప్పియున్న ప్రకారము రూ|| ౬౫౦ ఆర్నూటయేబదిరూపాయలు పెట్టుబడిపెట్టి ౧౮౭౧ సం|| ఫిబ్రవరినెల ౨౮ తేదివరకు పనులు జరిగించినప్పటికి నదిమొదలు ఏకసంవత్సరమువరకు అనగా ౧౮౭౨ సం|| ఫిబ్రవరినెల ౨౮ తేదివరకు అచ్చుకూటమున నుత్పత్తియయ్యెడు ద్రవ్యమువల్ల పనులు నడిపింపవలసినదిగాని భాగస్థులు పెట్టుబడి పెట్టవలసిన నిమిత్తము లేదు.

... ... ... ...

5. రెండవభాగము: ఈ ముద్రాక్షరశాలయొక్క కార్యముల నిర్వహించుటకై సదరు ముద్రాక్షరశాలకు భాగస్థులుగా నేర్పడియున్నవారిలో ఆరుగురు కార్యనిర్వాహక సభికులనియు తక్కినవారు ఉపసభికులనియు - పైని చెప్పబడిన రెండువిధములవారును జేరినపుడు మహాసభవారనియు పెంచఁబడవలసినది.

... ... ... ...

6. ఈ కార్యనిర్వాహకసభికులలో అగ్రాసనాధిపతులు - కార్యదర్శి - ఈముగ్గురును ప్రతిదినము జరిగెడు జమాఖర్చు లెక్కలయందున్ను బ్యాంకిలో రూపాయలు కట్టుచు మరల తెప్పించుకొనుచు నుండుటకుగా నేర్పరచబడ్యెడు బ్యాంకి లెక్కపుస్తకములయందున్ను రసీదులు మొదలైనవాటియందున్ను చేవ్రాలు చేయుచుండవలసినది.

... ... ... ...

7...లిఖితమూలకముగా తెలియజేయక సభకురానివారు ఒకరూపాయకు మించక కార్యనిర్వాహకసభికులు నిర్ణయించుకట్టము నియ్యవలసినది.

8...నిబంధనల నేర్పరచునపుడు సభవారి అభిప్రాయములు భేదించిన పక్షమందు ౧౬ దో కలములో చెప్పియున్న ప్రకారము అధికసంఖ్యగలవారి అభిప్రాయప్రకారముగా నిబంధనలను స్థిరపరచవలసినది.

... ... ... ...

9...భాగస్థులందరును సహోదరన్యాయముగా నేకీభవించి ౧౫ సంవత్సరములవరకు వ్యాపారము జరిగించి శ్రీ వేంకటేశ్వరస్వామివారి యనుగ్రహమువల్ల నభివృద్ధిజెందినద్రవ్యము ననుభవించుచు క్షేమముగ నుండుటకై నిర్ణయించుకొన్న చట్టములు ఎల్లవారలకు ఇష్టములై మంగళకరములై యుండవలసినది.

వావిళ్ల రామస్వామిశాస్త్రి

(ఇదిగాక మరి ౨౧ చేవ్రాళ్లున్ను ఉన్నవి).

శ్రీ బొబ్బిలి మహారాజావారు యాత్రకు వెళ్లినప్పుడు జరిగిన సంగతులు దినచర్యగా శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రులుగారు రచించిన దినచర్యగ్రంథమునుండి:—(139 వ పుట)

## బెంగుళూరుసంగతి

1886 సం॥ ఆగష్టు 12 తేదీకి సరియైన వ్యయసం॥ శ్రావణ బ౹౫౹గు॥ ఉదయకాలమునకు బెంగుళూరు కంటన్మెంటులో నొక బంగళాలో ప్రవేశించితిమి. రేణుగుంటనుండి బెంగుళూరువరకు రయల్ చార్జి జన ౧ కి రూ ౨-౪-౪ చొ॥ తగులును.

ఈబెంగుళూరు మహిసూరు రాజ్యములోనే చేరినది. యిక్కడ పటాలము లున్నవి. దొరలు చాలామందియున్నారు. శ్రీమహిసూరుమహారాజావారి లోగిలి విశాలరమణీయమైన దొకటికలదు.......

నీలగిరిపాటి చలిలేదుగాని, యిల్లుదాటితే బహువస్త్రాచ్ఛాదితులై

రాయుండక తీరదు. తరుచుగా వానలు కురియుచుండును. సూర్యదర్శనము అపురూపముగా నుండును. గాని జాస్తిగానుండును......

యెటుచూచినా ర మైళ్ళవైశాల్యముగల్గి షహరున్నది. ఫరంగీల్ను అరవమాలలు, తురకలు, సోల్జర్లు వగైరాలు క్రిక్కిరిసియున్నారు. గనుకనే మాంసపు దుకాణములు శతాధికముగానున్నవి.

## 6 శాసనములు

### రాజరాజదేవుని నందమపూండి శాసనములోనిది.

క్రి. శ. 10౫౩ ఎపిగ్రాఫియాఇండికా IV. పుట. ౩౧౮

పూర్వతః—ఇయ్యూరియుం బిల్లెము పెద్దపూణ్డియుం బొలగరుసున పల్లమున కొణ్డియగుంటనడును సీమా. ఆగ్నేయతః—ఇయ్యూరియుం బిల్లెము పెద్దపూణ్డియుం వెరపులయుం బొలగరుసున ముయ్యలికు ట్రసీమా. దక్షిణతః—ఇయ్యూరియుం వెరపులయుం బొలగరుసున తాడ్లచేవ సీమా. నైఋత్యతః—ఇయ్యూరియుం వెరపులయుం ముందర మునయుం బొలగరుసున ముయ్యలికుట్ర సీమా. పశ్చిమతః—ఇయ్యూరియుం ముందరమునయుం మడకుటిలియుం బొలగరుసున ముయ్యలికుట్ర సీమా. వాయవ్యతః—ఇయ్యూరియుం మడకుటిలియుం బిల్లెము పెద్దపూణ్డియుం బొలగరుసున ముయ్యలికుట్రున గొల్లచేవ సీమా. ఉత్తరతః—ఇయ్యూరియుం బిల్లెము పెద్దపూణ్డియుం బొలగరుసున యేఱువగడ్డయ సీమా. ఐశాన్యతః—ఇయ్యూరియుం బిల్లెము పెద్దపూణ్డియుం బొలగరుసున మఱ్ఱితోడి తాటియొద్ద చింతయసీమా.

### పృథ్వీశ్వరుని పిఠాపురము శాసనము A. D. 1186.

శకవర్షంబులు ౧౧౦౮ గు నేంటిమేష సంక్రాంతి నిమిత్తమున శ్రీ పిఠాపురమున శ్రీకుంతీమాధవదేవరకు బ్రోలునాంటిలోని నవఖండవాడ అని యొడిచూరు గృహక్షేత్రారామసహితముగా నఖండమున్న శ్రీమన్మహామండలేశ్వరవేలనాంటి కులోత్తుంగరాజేంద్ర చోడయరాజులకొమ్కులు శ్రీమన్

హామండలేశ్వర కులోత్తుంగ మన్మగొంకరాజుల మహాదేవులు జాయమదేవులు హావిబ్బకాల్యచ్చకాసాధ్ధకాము నిత్యనైమిత్తిక మాసోత్సవ సంవత్సరోత్స వాధ్ధకామున్ను గీతన్పృత్తవాద్యాది వివిధభోగాధ్ధకాముంగా నాచంద్రార్కకా ముగా నిచ్చిరి.

మల్లిదేవుని పిఠాపురశాసనము (A. D. 1195)

ఎపిగ్రాఫియా ఇండికా IV. 92.

అస్యగ్రామస్యసీమానః పూర్వతః వెలెంగ్గు బట్టిగుంట్టయసీమా. ఆగ్నే యతః వెలెంగ్గున ఏనిక అలనున భోడతాతకాలియసీమా. దక్షిణతః శ్రీపాద ములుపల్లి సీరిపురమున మయ్యానికుట్ట. వేముగుణ్డయసీమా. కొట్లురుకుఱును నల్లం చెఱువు కొమ్మున గుణ్డయకట్టివచ్చి నైఋృతితః ఏనుంగుదల క్రొప్పల్లిపొలమున మయ్యానికుట్టున పుల్లిగుంటయసీమా. పశ్చిమతః క్రొప్పల్లి తూప్పకాన కవల గుంటలసీమా। వాయవ్యతః చఱుకత్య బయలికేశవచంట్టుచెఱువు తూప్పకాన గట్టయవుఱు గట్టయసీమా. ఉత్తరతః సంప్పురపొలమున భీమరాజు చెఱువు దక్షిణము గట్టయసీమా. ఉప్పుతేఱును నక్కలకాలియంగలసిన మయ్యానకుట్టు మేరగానువచ్చి, ఈశాన్యతః ఉప్పుటేటి దక్షిణమున గట్టువట్టివచ్చి వెలెంగ్గున ప్రేనుల వంకయసీమా॥

హైదరాబాదు రాజ్యములోని వరంగల్లు పరగణాలో ఉన్న అనమకొండ రాజధానిగా పూర్వము పరిపాలించిన కాకతిగణపతిదేవనికాలమందు కరీమ్ నగరములోని ఉపర పల్లెలో రాతిమీాదచెక్కించిఉన్న శాసనములోని కడపటి భాగము.

క్రీ. శ. 1235.

శకవర్షంబులు 1157 మన్మథసంవత్సర మాఘశుద్ధ 15 గురువారము నందు పంచలింగాలకూను పించఱపల్లిని దేవబ్రాహ్మణవృత్తులుగాక సర్వకానమ

స్యముగానిచ్చి వెంజెయ్యిన మోందికాల్వను కొండకపుకాల్వదక్షిణమూను ఆవాంక అద్దాముచింతన మిట్టలూను రవ్వసాని అనకిందూను యింతపట్టుగూడ నుర్ ౧౩ ప్రోలకమ్మకాల్వచుర్ ౧ చొల్లుబాడె కాల్వచుర్ ౧ కాట్యాక్రయని చెయ్యిన బ్రాహ్మణవిత్తులుగాక సర్వమూను రవ్వసాని చెయ్యిన రవ్వసాని మామిడితోంట పడమటిఅనాను రాజెనాయంకుని చెయ్యినర్ ౭ వెలివోలను యెరువాక గుబ్బలి గదేవుత్రోవ దక్షిణమున ర్ 20 దీనిదక్షిణమున పెద్ద రేగడిలోన ర్ ౪౦ బొమ్మకంటి తెర్వు పడుమటనుండి పూరివెనెలిగ వెనెపద్ము ర్ ౬౦ యేటిమడమామిడి వనమూను వెనెకడ మామిడీవనమూను ఆవనము.లోని చింతలూను ఊరొద్ద మామిడివనమూను ఆచింతవనమూను ఊరిదక్షిణము తాడివనమూను అంగడి సుంకమూను ఇంతపట్టు కాట్యాక్రయమిందు దేవడ్లకు అంగభోగరంగ భోగధూపదీపనైవేద్య తాంబూలాలకు సూర్యాచంద్రుల కలంత్రగాలముఇచ్చిన ఈవి కాదన్నవారు గంగకర్తంగ ంబొడిచిన దోషానం బోదురు । కిందికాల్వను ర్ 10 ఇచ్చితిమి యింతపట్టు గణపతిదేవమహా రాజు నిడిచినదత్తి

• గణపతిదేవుని మోటుపల్లిశాసనము A. D. 1244

శల్ - శుల్కపరిమాణం. ఎక్కుడుడి దిగుమడిని ముప్పయింటనుఒక్కటి. శ్రీగంధము గులాము ఒకటికి । గ ౧ రూ కర్పూరమునకూ చీనికర్పూరానకూ ముత్యాలకూవెల । గ ౧ కి రూ ||| |||; పంనీరు |; దంతము జవాది కర్పూరతైలము రాగితగరము గిసేయసీసము పట్టునూలు పవడమూ గంధద్రవ్యాలకూను వెల । గ ౧ కి రూ ౧|-; మిరియాలవెల । గ ౧ కి రూ |:|-; పట్టు ఎల్లనానికిన్ని స్వరూపము ఒకటికిని రూ ౯ ||; పోంకలు లక్క ఒక్కటికిని । గ ౧ కి రూ ౩। పతోపష్ట్యధికైకాదశ శతసంఖ్యే క్రోధినామ్ని శకవర్షే మొట్టుపల్లి అభిధానే దేశాయ్యక్కొండ పట్టణే మహాతి గణపతిదేవః కీర్తిస్థాపితవాంశ్శాసనస్తంభం.

## దోనెపూండిశాసనము. 30—8—1338 A. D.

ఈ అగ్రహారానకు చతుస్సీమలుంనైన పొలమేరలు తూర్పునసీమల వల్లెపకొండునపేయు. ఆతటువాతకు నేరసాపుంత. ఆకరువాతకు ఎండపల్లి బూరుగువాయపేయు. దక్షిణానకు లంకపేయు. ఆతరువాతకు మందేనారాయణ దేవర ( ) వృత్తులపుంత పడుమటిసీమ. గొండెపురపుంబొలం అప్పరాజుదొడ్డి పుంత. ఆతటువాత దూసనేయు. ఉత్తరానకు సీమ కుక్కుటేశ్వర దేవరచింతచెరి పొలంపుంత. ఈ అగ్రహారానకు గ్రామగ్రాసముగాను దూసనేటిపడ్మటను పిఠా పురపుపొలములోను బొడ్డలదొడ్డి లంకంబెట్టింది పడిపుట్ల చేను.

## పిఠాపురము కుంతీమాధవస్వామి ఆలయములోని స్తంభముమీద కొటయవేమనవి 25-12-1391. A. D.

స్వస్తిశ్రీ శకవరుషంబులు అగునేంటి ప్రజాపతి సంవత్సర పుష్య శు ౧ గు । నాంటి మకరసంక్రాంతి పుణ్యకాలమందు కొటమరెడ్డి వేమిరెడ్డింగారు తమతండ్రి కొటమరెడ్డింగారికిన్ని తమతల్లి దొడ్డసానమ్మంగారికిని అక్షయ సుకృతముగాను పిఠాపురమందు శ్రీకుంతీమాధవదేవరకు శిలాప్రాకారము ఆచంద్రార్కముగాను చేయించిరి.

## తొత్తరమూడిశాసనము. కొటయవేమనవి

## శక 1333 A. D. 1411.

ఈవూరిపొలమేరసీమలు. తూర్పున తొత్తడిమూండి పొలమేరపుంత బత్తుల ముప్పడితోంట మామిండ్లు మొదలుగాంబోయి మల్లాయమ్మంగారి కొమరి గిరిపురపుపొలమేరపుంత మోచెను. దక్షిణాన ఆకొమరగిరిపురపు పొలమేర వుండే వృద్ధగౌతమి మోచెను. పడుమటను వృద్ధగౌతమి. ఉత్తరానను విద్యారణ్యతీర్థమని వృద్ధగౌతమిలోనిగుమి మొదలుగావచ్చిన తొత్తడిమూండి పొల మేరపుంత బత్తుల ముప్పడితోంట మామిండ్లు మోచెను.

## ద్రాక్షారామములో శాసనము. 28-10-1414 A. D.

యిటువంటి కాటమరెడ్డి వేమారెడ్డింగారికి నిజభృత్యుండైన కడియము మాచినేనింగారు తనకుస్వామి అయిన కాటమరెడ్డి వేమాయరెడ్డింగారికిన్ని వారి దేవులకున్ను కాటమరెడ్డి వేమారెడ్డింగారి కుమారుండైన కొమరగిరిరెడ్డింగారికిన్ని వారిదేవులకుంను అక్షయసుకృత మవునట్టుగాను దాక్షారామ శ్రీభీమేశ్వర శ్రీమహాదేవరకు అస్థానశిలామండపముకట్టించి శకవర్షంబులు ౧౩౩౬ అగు నేంటి జయసంవత్సర కార్తిక శు ౧౫ భా। నాండు సమర్పణచేసెను.

## రెండపదేవరాయలనాటి శాసనము 14-6-1428 A. D.

అస్యగ్రామస్యసీమా ఉచ్యొనిలిఖ్యంతే దేశభాషయా. తక్కెళ్ళపాటి అష్టదిక్కులసీమా నిర్ణయము. తూర్పునకు కుప్పెరాపిపాటిసంధుకు నక్కలవాగు. ఆగ్నేయభాగం సమరాపినూతుల కుప్పెరాపిపాటిసంధుకు బిల్లమనేని మిఱు. దక్షిణాన రావినూతులసంధుకు పశ్చిమాన రావిశెట్టికుంటకట్ట. నైరుతిభాగం రావినూతుల అలువలపాటి సంధుకు నక్కలవాగు తలాంపల్లగుంట. పడమటసీమ. అలువలపాటిసంధుకు [illegible]ంగంపిప్ప. వాయవ్యానకు అలువలపాటి జనకవరంసంధుకు జంగమకుంటసీమ. ఉత్తరానకు సీమ: పుంగులూరి సంధుకు తెల్లగుంట, ఈశాన్యానకు సీమ పంగులూరి కుప్పెరాపిపాటి సంధుకు సిలువరాయి. ఇంతవట్టి సమాప్తియ ప్రకారం

## అల్లయ వేమారెడ్డి దానశాసనములోనిది 7-[illegible]-1434

ఓం అల్లాడరెడ్డి వేమవరానకున్ను వేమసానక్క దొడ్డవరానకున్ను పొలమేరసీమాసంధులు. తుల్యభాగదక్షిణపుధార మొదలుకొని రెండుమూళ్ళపొలాల నడుమ పూర్వమందుల ప్రాంతపుత్త దక్షిణపుముఖమై వచ్చింది. అపుంతతూర్పు వేమసానక్క దొడ్డవరపుంబొలము అపుంతపడమట అల్లాడరెడ్డి వేమవరపుంబొలము అపుంతదక్షిణపుముఖమై రాంగాను అంత్తటను చింత్తవునది.

ఆచింతనుండ్డి తూర్పుముఖమైవచ్చినపుంత ఆపుంతనరుసపుంత వుత్తరం వేమ
సానక్క దొడ్డివరపుం బుంత దక్షిణం. ఆపుంత తూర్పుముఖమైవచ్చి వేమ
సానక్క దొడ్డవరపుంబొలంలోపలను చన్నుపాడె అనంగాను ఒకచెఱువుంనది.
ఆచెఱువువరసనుండ్డి ఆపుంత తూర్పు వేమసానక్క దొడ్డవరపుంబొలం
పుంతపడుమట ఆల్లాడరెడ్డి వేమవరపుంబొలము యీపుంత తొల్లింటిప్రాంత
పుంతదక్షిణపుముఖమైవచ్చి ఆపుంత ఆల్లాడరెడ్డి వేమవరపుం బొలములోప
లను యిఱువవారిపాడె అనంగా నొకపాడె; ఆపాడెమోచెను యిది అల్లా
డ్రెడ్డి వేమవరపు వుత్తరపుంబొలమేరసీమా. ఆయిఱువవారిపాడె దక్షిణపు
పార్శ్వాననుండి ఆతీరాననే ఒకగట్టుపొడలున్న ఆగట్టు తూర్పుముఖమై
వచ్చెను. ఆసరుసను గట్టు వుత్తరం వేమసానక్క దొడ్డవరపుంబొలం దక్షిణం.
ఆగట్టులకైతూర్పుముఖమైరాంగాను వేమసానక్క దొడ్డవరపుంబొలము
లోపలను నిమ్మగుంట్టపాడె (అ) నంగా నొక పల్లమున్నది. ఆపల్లంపసనుండ్డి
ఆగట్టు విశనకట్టపంపై అయిదుబారలు మేరం తవుత్తరపుముఖమై వచ్చెను.
అంత్తట నాగట్టువేంవ్వరపుంబొలము యీశాన్యభాగమంద్దు పొదపట్టిన
ప్రొంద్దుగున్నది. ఆంతటనుండ్డి ఆగట్టు దక్షిణముఖమైరాంగాను అంత్తటకు
నైరెండ్డుబారలు నిడుపునను తూర్పుముఖమైవచ్చెను. ఆంతట దొడ్డవరపు
బొలములోను పాములపాడె (అ) నంగా నొకపాడెదగ్గఱున్నది.

## కృష్ణదేవరాయల సింహాచలశాసనము శ-స-।౯।।.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౪౧ అగు
నేంటి ప్రమాదిసం॥ర శ్రావణ శు ౧3 సోమవారాన శ్రీమన్మహారాజాధిరాజ
రాజపరమేశ్వర మూరురాయరగండ అరిరాయర విభాడభాషగిత ప్రవరాయర
గండ యవనరాజ్యస్థాపనాచార్య శ్రీవీరప్రతాప కృష్ణదేవమహారాయలు
విజయనగరాన సింహాసనారూఢుడై సింహాద్రినాథునికి తమపేరింట భోగం
నడిచేటందుకు ప్రతాపరుద్రమహారాయలు చేతను పుచ్చుకొన్నగ్రామాలు కళింగ

దండపాటులోను గ్రామాలు పెదగాణిగ్రామం అగ్గనపూడిగ్రామం అందుకు పెల్లెపల్లెలు గంగవరంపల్లె ౧ పిన్న అగ్గనపూడిపల్లె ౧ ఉభయంగ్రామాలు సింహాగిరి అప్పన్నకు నడిచేభోగం బలిహారణం కట్టెడదినం ౧ కి శ్రీఅంగరంగభోగానకు గంధం పలం అగరు మ ౨ వు, కర్పూరంచిన్నం. కస్తూరి చిన్నం, పన్నీరు చి ౪, కుంకుమపువ్వు చి ౧, పుష్పలసందలు ౪, మాలలు ౪, నైవేద్యానకు బియ్యం పు ౧, పకాళం తూ ౨, పాయసం తూములు ౬, కూరలు ౪, పిండి వాడీలు ౮, సారసత్తులు ౮, అరిశలు ౮, సాదుమనోహరాలు ౮, చిన్నమనోహరాలు ౪. నంచివాసితాలు ౮, అప్పాలు ౮, హంసకణీలు ౮, కర్పూరకాంతులు ౮, బడాలు ౮, కక్కెరాలు ౪, పెరసి ౮౦, పానకాలు ౨. గుటుకాకుంచాలు ౧, నైవేద్యానకున్ను పిండాలకున్ను కూడా నెయ్యి ౨ తూములు, పెరుగు యిద్దుకు, కుంచెమిరియాల్లు. ౪ పోకలు, ౫౦ తమలపాకులు ౧౦౦ మిరియాలుక్షుసంభారాలు ౫ కరాంబువుత్తు మాడలు, జాజికాయలు ౧౦, యిందుకు వెచ్చం. సత్రం వేయించిరి. బ్రాహ్మణ భోజనము. ఈధర్మానకు యవరుతప్పినా వారుగంగలోను గోహత్య బ్రహ్మహత్య మాతృపితృహత్య చేసిన పాపాన పోవువారు.

హంపి సమీపమందున్న శిలాశాసనము.

South Indian Inscriptions Vol IV No 280.

(1556 A. D.)

శుభమస్తు। స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౪౭౮ అగునేటి నళసంవత్సర ఆషాఢ శు ౧౨ గు శ్రీమద్రాజాధిరాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివదేవమహారాయలు విజయనగరమందు రత్నసింహాసనారూఢుండై పృథివిసామ్రాజ్యం చేయుచుండ్డగాను ఆత్రేయగోత్రం సోమవంశోద్భవులైన శ్రీమన్మహామండ్డలేశ్వర రామరాజు కోనేటయ్య దేవమహారాజులుంగారిపుత్రులు అఘుభళరాజులుంగారు తిరుమంగయాళ్వాల్లకు

శేయించ్చిన కయింకర్యవివరం । విఠలంలోను శ్రీవిఠలేశ్వరులకోవిల ప్రాకారం
వెలుపల వాయవ్యభాగాన వేంచ్చేశివున్న తిరుమంగ్గయాళ్వార్లకును గర్భ
గృహం శుకనాశి అంతరాళికం రంగ్గమంటపం మొదలైనవి నేముకట్టించి
నిత్యతిరుమంజనకాలం తిరుతోంపు తిరునందవనం తిరుతోమాల తిరువెళక్కు
తిరుమేనికావలి తిరుకట్టి యివి అన్నిన్ని తిరుమంజనకాలం రామానుజయ్యం
గారి వశంచేసి కోవిలస్థానికంశిష్యపారంపర్యంగాను నడపుకవచ్చేయట్టుగానున్ను
దధ్యోదనం మధ్యాహ్న అవసరం సాయంకాల అవసరం నిత్యోత్సవం మాసో
త్సవం నిత్యతిరువారాధన చందనకాపు అడికముదు సౌతెముదు పరిమళ
ద్రవ్యాలు యివి మొదలైన సర్వకయింకర్యాలున్ను తిరుమంగ్గయాళ్వా
ర్లకు అవధరించి కోవిల తిరుమల పెరుమాంగోవిల మొదలైన దివ్యతిరుపతుల
నుండ్డి కయింకర్యార్థకాలమై వేంచేశి స్వయంపాకనియమమైన చాతిన చాతాని
శ్రీవైష్ణవులకు శ్రీరామానుజకూటంగాను ఆరగింప్పం జేశేటట్టుగానున్ను శ్రీ
విఠలేశ్వరులు తిరువీధులు వేంచ్చేశేటప్పుడల్లాను దోశపడిన్ని అడికముదు మొతె
ముదున్ను శ్రీవిఠలేశ్వర్లకు తిరుతేరుతిరునాళ్లు తిరువధ్యానం సహచరపులు
నాలుగున్ను నమాళువార్లకు తిరుతేరుతిరునాళ్లు తిరునక్షత్రాల తిరువీధులు
వేంచ్చేశినప్పుడల్లాను దోశపడిన్ని తిరుమంగ్గయాళ్వార్లకు తిరునక్షత్రాలు
తిరువధ్యానాలకు దోశపడిన్ని నమ్మాళువార్లకున్ను శ్రీవిఠలేశ్వర్లకున్ను తమ
తమ తిరుతేరు తిరునాళ్లనాండు వాక్కుక్కుపారి తిరుమంగ్గయాళ్వార్లకు
కోవిలకు వేంచ్చేశిన చరపులకున్ను యింతపట్టు కయింకర్యాలకున్ను నేము
సమర్పించిన గ్రామాలు కొప్పళంశీమలోని అబ్బెగెరెగ్రామమున్ను యిందుకు
గ్రామగ్రాసమయిన యిలికంట్టిశీమలోని కెచ్చిణ డోణిగ్రామమున్ను యీ
రెండుగ్రామాలున్ను అబ్బెగెరె తిరుమలభట్లు మొదలైన మహాజనాలు
అందరి చేతనున్ను క్రయంగొని అందుల తామ్రశాసనాలు మొదలైన సాధ
నాలు అన్నిన్ని తీసుకొని సమర్పించిన అబ్బెగెరి కెచ్చిన డోణిగ్రామాలకు
ప్రతినామమైన పరకాలపురం శ్రీరామానుజపురంగ్రామాలు ఈ రెండున్ను

నేము రామరాజయ్యవారి చేతను సదాశివరాయలకు విన్నపం చేయించి కంప్పిలి మాంగాణి స్వామ్యానకు చెల్లివచ్చే విఠలాపురం శ్రోత్రియంమడి స్థావరంమడి సహా ధారవోయించ్చి తామ్రశాసనం తీశియిచ్చిన విఠలాపురం గ్రామం ౧ వొకటిన్ని కూడాను యీ మూడుగ్రామాలున్ను సమర్పించి యీగ్రామాల పారుపత్యం చేశి స్వయంపాకులకు తిరువారాధకులను పరిచారకులకు బొక్కస భండారాలు వ్యగ్రాణము మొదలయినపనులకు అనుకూలమైన మనుష్యులను పెట్టికొని యీ కయింకర్యాలు అంతవట్టున్ను శిష్యపారంపర్యంగాను నడపుక వచ్చేయిందుకును తిరుమలనంబ్బి శ్రీరామయ్యంగారి వశం చేశిన్ని యీశాశిల స్థలకరణీకం నయనారు తిరువెంగ్గళయ్యంగారిక్కి పుత్రపౌత్ర పారంపర్యాం లిఖ్ఖాయం గట్టడిచేశిన్ని యిండ్దుల సంకీర్త్తనశావ తమ పుత్ర పౌత్ర పారంపర్యాగాను చేస్తున్ను వుండేటట్టుగాను శ్రీరామానుజపురం నారాయణయ్యంగారు జన యిద్దరున్ను యీమర్యాదను మా గురూచార్య్యులు తిరుమల అప్పళు తిరువెంగ్గళాచార్య్యులయ్యవారికి పుణ్యముగాను కట్టడచేస్తిమి॥ గనక యీధర్మణము ఆచంద్రార్క్కస్థాయిగా నడపంగలవారు। యీధర్మానకు యెవ్వరుగనక తప్పినాను గోహత్య బ్రహ్మహత్య స్త్రీహత్య మొదలైన పాపాలు చేశిన దోషానం బోయినవారు। తమ తల్లిదండ్రాములను వధించినదోషానం బోయినవారు॥

గోల్కొండకోటలోని శాసనము (1666 A. D.)

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షాలు 1587 మన్మథ నామసంవత్సర మాఘు శు ౭ బుధవారంనాడు సుల్తాను అవరంగుజేబు ఖుసరు శహాజీ సంగీను లస్కరుతో వచ్చి కిలెముబారకు మహామదానగారు బెడావేసి వుండంగాను వారిపాదుషాహివజీర్లలో పెద్దవజీరుడు మీరు మీరా అని అతని అవరంగుజేబులో ఉట్టి యీమర్గం మూడుదినాలుక్కు పుచ్చుకొంటున్నానని

మోచా...రాత్రిపగలు చాలా నేటి...కందెగ్గి రాలేదు...జుక్షజహామతాహా జరత్ సుల్తాను అబ్దుల్లా కుతుబ్‌శాహాగారు తన సేనల దొడ్డ వజీరుడు మొక ర్రబుహాజీరతు అనుస్సాఖానునిగారికి హుకుంయిచ్చి నీవు ఆ బురుజువద్ద వుండి పరదంపుకొట్టి అందుకు చాలా జాగ్రత కలిగివుండవలెనని అలాగే ఖాను మశామ్నులహేగాదు రాత్రిపగలు జాగ్రతతో గనిములు దఫే చేసే పనిలో ముఖ్యులై వుండంగాను ఘోరాజాత్తా ఫిరంగిగుండు ఆమీరుమీరాకు తగిలితేను ఆ మోచాలోనే మృతుతు అయిపోయెను. అట్టి మృతమాయిన మూడుదినాలకు ప...న ఆయను మోచా + + ంపనహాగారి హుకుంతుయితే అలాగే యేలినవారి హుకుంచొప్పున ఖానుమశార్నులహేగారు కొంచెము దివసాలలో వుప్పర ధర్మాచార్యులచాత తమామముస్తాఇదు చేయించెను. అవరంగుజేబు వచ్చినసాలు సు॥స్న సెత్తుఖమసెను. అల ప్రతిమామముస్తాఇదు అయినది సు॥స్నసమానుసెతైగు అలవు ౧౦౭౮ శాలివాహనశకవషాలు ౧౬౮౭

## నెల్లూరిజిల్లా శిలాతామ్రశాసనములలోనిది (1791 A. D)

స్వస్తిశ్రీ శా. వా. వ ౧౭౧౩ విరోధికృతునామసంవత్సర జేష్ట శు ౧౫ లు కలిగిరి వెంకటాచలంగారు ముత్యాలపాటిపాలెంలో కాశీరామేశ్వరపుఘాటులో కోనేరు తొవ్వించి పూరితో సత్రం కట్టించి ధర్మం నడిపిస్తూ వచ్చినారు. తదనంతరం వారి రెండో సహోదరుడయిన కలిగిరి శేషయ్యగారును ఆధర్మం పరిపాలనచేస్తూవచ్చి ఆయున దినములలోనున్న సదరహి వెంకటాచలయ్యగారి మనమడైన కలిగిరి సుందరయ్య కొన్ని దినములు సదరు ప్రకారం ధర్మం నడిపిస్తూవచ్చి దుర్ముఖిసంవత్సర మాఖ శు ౫ లు ధర్మసత్రం పెంకుటిల్లు కట్టించి శార్వరిసం॥ ఆషాఢ బ ౨ గురువారం శ్రీం॥ మం॥ గృహప్రవేశం అయ్యినది.

# ధర్మశాస్త్రం

## కోర్టు — సాక్ష్యము.

జె-ఆర్-కిండర్స్లిగారిచే ఇంగ్లీషుభాషలో రచించబడిన

సాక్ష్యశాస్త్రసంగ్రహము.

ఇది హైకోర్టులో నొక ట్రాన్సులేటరుగానుండు

పుండూరు పార్థసారథిసెట్టిచే తెలుగుభాష చేయబడి చన్నపట్టణములో

అచ్చువేయించబడియె. ౧౮౯౬ సం॥

పుట 116-11౭. సన్నిహితమరణసమయోక్తులను యెంతమట్టుకు నమ్మవచ్చుననే సంగతినిగురించి ఆలోచించడమందు ఈ వెంబడివచ్చు అంశములను యోచించడము ఉచితముగా వుంటుంది. అవియనగా, ౧-ఆ వచనములు సాక్షులచే సరిగా తెలియచేయబడినవాటివలె అగుపడుచున్నవా? ౨-చనిపోయినవాడు జరిగినదాన్నిగురించి స్పష్టమయిన యభిప్రాయము కలిగియుండినట్లగుపడెనా-లేక ఆ కలహమందలి కలవరమువలనను ఉద్రేకమువలనను పొరబడివుండవచ్చునా? ౩-వాడు నేరము మోపబడినవానిమీద యేదయినా చలముగాని కార్పణ్యముగాని పెట్టియుండెనా? ౪-నేరము మోపబడినవాడు ఆ మాటను చెప్పినవానిని ప్రత్యాఖ్యానప్రశ్నలు అడుగుటకు యేదయినా సమయముండెనా? అనునవి.—రా-౩౪.

### ౯ కొన్ని విషయములలోని వైద్యుల శ్రుతసాక్ష్యము.

౨౩౬. క్రిమినల్ వ్యవహారవిషయమైన నూతనశాసనము ఈ వెంబడి వ్రాయబడినరీతిన విధించుచున్నది. "౩౬౪-వ ప్రకరణము-

"కోర్టువారు సివిల్ సర్జనుగావుండే - లేక ఇతరవైద్యుడుగావుండే మనిషివద్ద పుచ్చుకోబడి, మేజస్ట్రేటుగారివల్ల యదార్థపరచడమునుగురించి సంతకము చెయ్యబడ్డ విమర్శను నిదర్శనమయిన సాక్ష్యముగా పుచ్చుకోవలసి

నది. అయితే ఆ కోర్టువారు చాలినంత కారణమున్న యెడల అట్టి సివిల్ సర్జనుగావుండే లేక ఇతరవైద్యుడుగావుండే సాక్షికి సమ్మన్ చెయ్యడము యుక్తముగా వుండవలసినది."

౫౩౭. ౩౭౦-ప్రకరణము.—పరీక్షకొరకు, లేక పరిశీలనకొరకున్ను రిపోర్టుకొరకున్ను క్రమముగా తనవద్దికి పంపించబడ్డ యేదయినా సంగతిలేక వస్తువు వీటినిగురించి గవర్నమెంటుతాలూకు రసశాస్త్రసంబంధమైన వస్తువుల పరీక్షచేసే ఉద్యోగస్థుని రిపోర్టుగా వున్నట్టు అర్థమయ్యే యేదయినా దస్తావేజు, యేదయినా క్రిమినల్ విచారణ, లేక అందులో ఇలాకాగల యేదయినా క్రమవిచారణ జరుగుతూవుండగా అట్టి పరీక్షచేసే మనిషియొక్క దస్కతు దానిమీద చెయ్యబడివున్న పక్షమునకు సెర్షకోర్టువారివల్ల విమర్శలో సాక్ష్యముగా పుచ్చుకొనబడవలసినది. మరిన్ని అట్టి దస్కతునుగురించిగాని దస్కతుచేసేమనిషి అట్టి ఉద్యోగము కలిగియుండడమును గురించిగాని రుజువు. ఆ దస్తావేజు వాస్తవమయినది అవునో కాదో అని కోర్టువారు సంశయించడమునకు కలిగియుంటేనేతప్ప జరూరు వుండనేరదు"

౫౩౮ అట్టి విషయములలో శ్రుతసాక్ష్యమును అంగీకరించడము కేవలము లోకసౌకర్యమును గురించిన యోచనలనుపట్టి మెప్పించగలదైయున్నది. అది ఇండియాదేశములోని ప్రజలు ఉండునట్టి తత్కాలపు విశేషమయిన స్థితికి ఒప్పియుండవచ్చునుగాని. ఆ ప్రజలు నాగరీకమందభివృద్ధిపొంది వైద్యులు మెండయ్యేకొలది చట్టము మార్చబడునని మనము నిరీక్షించవచ్చును. ఇండియాదేశములో రసశాస్త్రసంబంధమైన వస్తువుల పరీక్షచేసే వుద్యోగస్థుడు నిరంతరముగాను శాస్త్రశిక్షితమయిన వైద్యులు బహుశః యెల్లప్పుడును, దొరతనపువారి కొలువులో వుంటున్నారు. వారికి బరువైనపనులు వున్నవి గనుక వారిని పలుమారు రప్పించుటచేత రోగులకు సంకటము కలుగును. ఇదిగాక దొరతనపువారి కొలువులోవుండెడు వైద్యశాస్త్రజ్ఞుల వుత్తరవాదత్వము సత్యమువలన స్థాపితమైనదానికంటె హీనమైనదిగా వుండినను,

దానిబట్టి వారు తమ యెదటవుండెడుసంగతిని సాధారణముగా జాగ్రతగా పరీక్షించి యదార్థమైన వృత్తాంతమును చెప్పుదురని యోచించబడవలయును. విశేషించి మేజస్ట్రేటుయెదట వైద్యుడు సాక్షిగా విచారించబడినవిషయములో అట్టిసాక్ష్యము సత్యముమీదగాని ప్రమాణపూర్వకముగాగాని చెప్పబడిన దనియు, నేరము మోపబడినవాడు ప్రత్యాఖ్యానప్రశ్నలను అడుగుటకు అవకాశము కలిగి యుండెనని యు అనుమానించబడవచ్చును.

## సాక్షులను సమ్మను చేయుట.

౨౩౯. కక్షివాండ్లనున్ను, సాక్షులనున్ను న్యాయస్థలమునకు రప్పించు విధమును పరిష్కారముగా వివరించిచెప్పుట ఈ స్వల్పగ్రంథముయొక్క ఉద్దేశములో చేరిన విషయము కాదు. సాక్షులను సమ్మను చేయుటను గురించిన నిబంధనలు సివిల్ విషయములలోను క్రిమినల్ విషయములలోను తరుచుగా వొకటిగానే యున్నది. ఆ పద్ధతి సివిల్ క్రిమినల్ ప్రొసీడ్యూరు శాసనముల వలన తెలియును. సాక్షి యేకాలమందు యేచోటికి వచ్చియుండవలెనో ఆ సంగతులనున్ను వాడు ఒక దస్తవేజును తెచ్చి దాఖలుచేయవలసినదో లేక ఆ వ్యాజ్యములో సాక్ష్యముమాత్రము చెప్పవలసినదో ఆసంగతినిన్ని మరియు ఆ వ్యాజ్యపు కక్షివాండ్ల పేళ్లనున్ను సమ్మనులో ప్రదర్శించవలయును. దస్తావేజును తెచ్చి దాఖలుచేయవలసినయెడల అట్టి దస్తావేజుయొక్క వివరము ఆ సమ్మనులో వ్రాయబడవలయును.—౧౮౭౯ సం॥ ౧౦-శా-౧౭౨-ప్ర. ౧౮౬౧ సం॥ ౨౫-శా-౧౮౬-ప్ర.